శ్రీ

# భావనారాయణ శతకము.

ఇది

తురగా వేంకటాచలము పంతులు, బి. యే., గారిచే

రచింపఁబడి

కే. వి. కృష్ణారావుచే

గుంటూరు

వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1911.

వెల రు 0-1-0.

# ఉపోద్ఘాతము.

అయ్యలారా,

శ్రీ పొన్నూరి భావనారాయణక్షేత్రమాహాత్మ్య మాం
ధ్రీకరించుటకు శ్రీ తురగా వెంకటాచలము బియేగారు శ్రీ భావ
నారాయణస్వామివారి ధర్మకర్త్రిగారగు రాజా వాసిరెడ్డి వేం
కటలక్ష్మీనరసమాంబా రాజ్ఞీ బహద్దర్ మన్నెసుల్తానుగారిచే
ప్రార్థితులై, యాయాంధ్రీకరణంబునందు నేబదిపద్యములను
మాత్రమే రచియించిరి. పిమ్మట శ్రీబియేగారు తమశరీర మా
రోగ్యశూన్యంబగుడు నిక్కార్యము నెరవేరదని యెంచికొంతకా
లు నెటులైన శ్రీ భావనారాయణస్వామివిషయక గ్రంథరచన
చేఁ దమజన్మను సార్థకముగావింప నెంచి యీభావనారాయణ
శతకమును కొన్నికీర్తనలను వ్రాసిరని తోఁచుచున్నది. దీని
లోని కొన్నిపద్యములవలన శ్రీబియేగారు రోగబాధచే మిగుల
నాయాసపడుచున్న సమయముననే యైహికాముష్మికసాధనము
గున నీగ్రంథమును రచించిరని కన్పట్టుచున్నది

వీరిపుస్తకమును చిత్తువ్రాతలోనుండి తొలఁగించి శుద్ధప్ర
తిగా వ్రాయునంతటి యవకాశము లేకయే బియేగారు స్వర్గ
మలంకరించిరి గాన, దానిని సరిచేయుభారము నాయందుంచఁ

బడెను. నేను జిత్తుచు సాఫ్యుఁ జేసికొనినగాని వారిప్రయోగములం దు నూటఁదొంబదితొమ్మిదిపాళ్లుమార్చ లేదు. వారి ప్రప్రయోగములను బహుగ్రంథద్రష్టలగు చదువరులే సమన్వయించుకొనం దురుగాక.

ఇట్లు భవద్విధేయమిత్రము,

శతావధాని, కాశీ కృష్ణాచార్యులు.

# పీఠిక

శ్రీ హిజ్ యెక్సలెన్సి సర్ ఆర్థర్ లాలీ ప్రభువుగారు 1908 సంగిరం డిశంబరు నెలలో గుంటూరుపట్టణమునకు విచ్చేసి నప్పుడు తదాగమన గౌరవసూచకముగా నప్పటి మండలాధికారియగు శ్రీ॥ బ్రాడీదొరవారిచే స్వర్ణపతకము బహుమానమొందిన రాజమహేంద్రవర పురనివాసియు నస్మచ్ఛ్రేయోభిలాషియుం గవివర్యుండును నగు బ్ర॥ మ॥ శ్రీ॥ వడ్డాది సుబ్బారాయనిగారికివలె నాకును గౌరవము జరుపఁబడమికి నిరుత్సాహము నొందిన యస్మత్పరమాప్తుండును న్యాయవాదియు గుంటూరు వాస్తవ్యుండును నగు మహారాజశ్రీ న్యాపతి హనుమంతరావు పంతులుగారి యమితప్రోత్సాహ మీగ్రంథము వెలువడుటకు ముఖ్యకారణమయ్యె. పైఁజెప్పిన బ్రాడీదొరగారి బహుమానసంభావనాసమయమునందె నాచే దైవవిషయక గ్రంథమొకటి నిర్మింపఁజేయఁదలంచి తరుణమున నే పంతులుగారు తమయభిప్రాయమును నాకు వెలిపుచ్చిరిగాని సాధనాభావముచేతను మఱికొన్ని కారణములచేతను నీవిషయమం దెంత ప్రోత్సాహము వారికున్నను గ్రంథప్రారంభమునకె యొకసంవత్సరము పైవరకు వలనుపడినదికాదు. పంతులవారు బాపట్లతాలూకా పొన్నూరునందు వేంచేసియున్న శ్రీ భావనారాయణస్వామి దేవస్థాన ధర్మకర్తలును బారమార్థికచింతగలవారును మాన్య

లును నగు శ్రీరాజా వాశిరెడ్డి వెంకటలక్ష్మీనరసమాంబారాజ్ఞ గారికి నేతత్కార్యనిర్వాహకమునఁ బ్రతినిధులుగా నుండుటం జేసి తద్దేవస్థాన స్థలపురాణమునకు నాంధ్రీకరణము భావనారాయణశతకమును గీర్తనలును నాచేఁ జేయింపదలంచి సరసమతులగు శ్రీరాజ్ఞీగారి యంగీకారపత్రికను జాలకాలముక్రిందటనే పడసియున్నను స్థలపురాణమాతృక యలభ్యమగుటం జేసి పెక్కుమాసములట్లుగడచిపోయెను. ఈమధ్యకాలములో నాకును శ్రీరాజ్ఞీసోదరులును ప్రొబేషనరీ డిప్యూటి తహశ్శీలుదారుగారును నగు శ్రీ చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణప్రసాదము బియేగారికిని గాకతాళన్యాయముగా గుంటూరుపురమున దైవప్రేరణమున లభించిన పరిచయస్నేహఫలముగా వారు నాచే వ్రాయించి ముద్రింపించిన శ్రీ సరోజినీనాటకమును గన్నులారఁజూచియానందించినతోడనె పంతులవారికిని శ్రీరాజ్ఞీగారికిని వారి జ్యేష్ఠసోదరులును భగవద్భక్తులునగు శ్రీ చిరుమామిళ్ళ భానుప్రసాదముగారికిని శ్రీ భావనారాయణ స్థలపురాణము నాచే నాంధ్రీకరణముచేయింపవలయునను కుతూహలమినుమడించెను. తత్కార్యనిర్వహణార్థమై శ్రీపంతులవారు గడచిన ఫాల్గుణమాసమునం దొకశుభదినమున నన్ను కొరిటెపాడు వనభవనంబుననున్న శ్రీరాజ్ఞీగారి దర్శనమునకు సగౌరవముగాఁ దోడ్కొనిపోయి యస్మత్కృతగ్రంథములనుండి కొన్నిపద్యములను నాచే వారికి వినిపింపఁజేసి యామోదముకలిగించి శ్రీ భావనారాయణ స్థలపురాణాంధ్రీకరణశతకములను గీర్తనలును చేయుడని వారిచే నన్నుఁగోరఁగాఁజేసి వారి సోదర

రత్నమగు భానుప్రసాదముగారిచే సకర్పూరతాంబూలము ని ప్పించిరి. శ్రీపంతులవారి యాద్యవాంఛాంకూరమునకు వారె యిట్లు దోహదముకల్పించుకొని కట్టకడకు ఫలములు నాచేబం డింపఁజేయించిరి. ఇప్పుడు నేను ప్రపంచానుభవమునకు వ్యా ప్తముజేయఁ బ్రచురింపఁదలఁచిన పద్యఫలములు స్వాదనీయము లో తిక్తములో యామ్లములో పఠనానుభవశాలురే విశదీకరిం ప వలసియున్నది.

తురగా వేంకటాచలము,

గ్రంథకర్త.

ఇట్టి పుణ్యక్షేత్ర సంబంధమగు నీ గ్రంధరచనానంతరము నాపరమమిత్రులగు నీ వేంకటాచలం పంతులుగారు పరమపద ము జెందినందున అముద్రితస్థితియందుండిన నిది ప్రపంచమున కంత ప్రయోజనకారిగ నుండఁజాలదను తలంపుచే దీనినిముద్ర ణము జేయించి ప్రచురపరచితిని.

గుంటూరు. చిరుమామిళ్ళ నారాయణప్రసాద్, బి. యే,

ప్రా॥ డి॥ తహశ్శీల్ దారు.

ـ 2014 ـ



శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# భావనారాయణశతకము.

శా॥ శ్రీశృంగారవిభాసితాంగ నిగతక్షేమంకరాపాంగ మో
హా[illegible]శాపాశనిబద్ధభక్తజనతాహర్షప్రదా తుంగభ
ద్రా[illegible]నాలవతీతటీ వి[illegible] చితోద్యత్సౌఖ్యసంపాదకా!
యీశా! స్వర్ణపురీనివాస! గుణరాశీ! భావనారాయణా! ౧

మ. [illegible]వదానందసురూపవిగ్రహ మనల్పప్రీతిఁ బొన్నూరఁ జ
[illegible]నువుం గాంచిన నాఁటఁగోలె మనమస్తోకాచ్ఛభక్తిన్ని నున్
జపలూరించెడుఁ బద్యరత్నముల నిచ్చల్వర్ణనల్సేయు భా
గ్యశ్రీ[illegible]వంబుగా బొందఁగోరెదు ననంతా భావనారాయణా. ౨

మ. [illegible]తాచాతురిగన్న పూజ్యములలంకారాది సద్గ్రంథవ
ర్గ్యో[illegible]నంబులు సంస్కృతాంధ్రరచనల్ శూన్యంబు లోకానుభూ
[illegible]చారింపఁగ నాస్తి నాకు నెటు సాధింతు నమ్ముదృష్టముల్
[illegible] దేవా భావనారాయణా. 3

మ. సుడిగాలుల్వడివీవఁ దాడిపొడవున్నాచించు కల్లోలముల్
నడిమింటన్గొనికూలదుర్భయనిదానంబైన సంద్రంబునన్
గడుభీతింజను నావఁబోలె నతిదుఃఖవ్యాప్తమౌ సంసృతిన్
[illegible] భావనారాయణా. ౪

మ. దొరల౯ లెంకలదాతలబుధులను సాధుశ్రేణిదుర్మార్గుల౯
స్ఫురదాకారుల రూపహీనులను జ్ఞానులమూర్ఖుల నీవిలా
సరుచిం జిత్రపుఁ దోలుబొమ్మలుగ నిచ్ఛన్ సేయాడింతు న
వ్యక్తశ్రీ నాటకసూత్రధారివలె దేవా భావనారాయణా. ౪

మ. కనులంజూడఁగ రావటంచునిను నజ్ఞానావృతుల్నాస్తియం
చనఁగాఁ జాతురు హేమకశ్యపుని పాత్యంబొక్కటేచాలదే
యనఘా, దీనికి సూక్ష్మవస్తువులయందైనం గనంజాలు నీ
యునికి౯ స్థూలశరీరులెలగనరొక్కో భావనారాయణా. ౫

మ. శిలయందుండును దారువందుఁగలఁడే చిజ్జ్యోతినారాయణుం
డలతామ్రంబున వెల్గునే యనుచు శుద్ధాజ్ఞానతంబలుక్క ప
లుక్కల నాలించినఁ గణకశూలములటుల్లోఁచుంగదా విగ్రహం
బులెగా నిశ్చలబుద్ధిఁగూర్చుకరణంబుల్ భావనారాయణా. ౬

మ. ఘటమందున్మఠమందు గోపురమునం గాన్పించి యాకాశమొ
క్కటె భిన్నాభిధలొందునట్లై మతిసంకల్పంబునం దేహనం
ఘటితంబై పరమాత్మయాకృతుల లెక్కల్లేక తాఁదాల్చియు
త్కటనామంబులు పెక్కులొందెడునుగాదా భావనారాయణా. ౭

శా. నీరూపంబు భజించి యుక్తవిధుల న్నీకర్చనల్సల్పి చే
తోఁరాజీవమునందు భక్తనిను సంతోషంబుతోనిల్పి యా
త్మారాముం గనఁజాలు భక్తునికి దివ్యానందకళ్యాణశో
భారమ్యంబగు జ్యోతికన్పడదె దేవా భావనారాయణా. ౮

మ. తనబిడ్డల్ స్వకదత్తభక్ష్యముల నాస్థంజేతికందీయఁగా
ననతుండై ల్లనమంగి నానిమలల స్సంతృప్తిఁబత్రాళికే

తినుమంచుక్ దయసేయునట్టు లతిభక్తిన్నీకు నర్పించునీ
ధనములన్నిక కెయ్యెసంగె దర్శిలి ననన్తా భావనారాయణా. ౧౦

మ. గుడితీర్థానుష్ఠుడై నిల్పనో ప్రజ మొదలోవ్రాళ్లు తాదేనినో
స్థిరలక్ష్మ్యంబునకున్ ఘటించుకొని దృష్టింబెట్టుకోకున్న న
త్తురకూన్యాండు పఠింపఁగాఁగలఁడె సద్గ్రంథంబు నీరూపమా
పరజీర్ణన్ననఁజేయు సాధనము శ్రీశా భావనారాయణా. ౧౧

శా. ఆకాశంబను కప్పుకప్పితివి బ్రహ్మాండంబు నీయింటికిన్
జీకట్లుంతటఁ బర్వనెల్లెడల వానింబాప నాకప్పులోన్
వీకన్నిస్తులకాచఖండచయము న్నిర్మించినావో యనన్
నాకుందోఁచెడు సూర్యచంద్రభములన్నా భావనారాయణా. ౧౨

మ. పొరపాటుల్గనలేము నీసృజనలోఁ బూర్వాపరంబుల్ సహా
నగహీన్ సాగరసాలవృక్షమునకెన్నన్ దత్ఫలశ్రేణియే
నెరుగన్నారి మఱొండు గల్గునొకొ యుర్వీజంబు వెన్కన్బలో
త్కరముల్ముందునుగల్గునే భువి ననన్తా భావనారాయణా. ౧౩

మ. దళమందున్నదు నీనెయ్యి నెకును మధ్యస్థానముల్నాటిగాఁ
గొలతన్గొల్చుచుఁదీర్చినట్లెసఁగు నాపుత్రెండుమూఁడన్ని రె
మ్మలకుండన్వలె నన్నియేపడము నీమాయావిలాసాళికిన్
చలనన్ వ్యత్యయమింత లేదుగద దేవా భావనారాయణా. ౧౪

మ. కడుపుందీపికి సాటిలేదుగద లోకంబందునో తండ్రి నీ
బుడుతల్ దైన్యపరీతులైన నవిసమ్మోదంబు నీకెట్లగున్
జడతంబల్కినఁ గొందఱట్టులు మనస్తాపంబు చేదండ్రిదా
నడరింపన్నిరసించు పుత్రకులు తేరా భావనారాయణా. ౧౫

శా. నిన్నుంబోలె రసజ్ఞుఁడందుఁ బితయున్ నిక్షేత్రయున్ రాజునా
పన్నత్రాణుఁడు నాత్మబంధువుఁడు సంభావ్యుండు జ్ఞానైక సం
పన్నుండున్ గృతకృత్యుఁ డూర్జితదయావారాశి యీశ్వరుం
డున్నాఁడా నను గన్నతండ్రి నతబంధూ భావనారాయణా. ౧౬

మ. తనదండింపఁగ మాతతండ్రియొడి కాస్థన్ బాలుఁ బిడ్డం దనన్
జనకుండే యదలించినన్ బెదరి యాసన్ మాతనుం జేరుసిన్
గనలం జేసిన నన్నుఁ డొండుఁ గలఁడే కాదంచు బ్రోవంగ నుం
డిన రక్షించిన నీవె దిక్కుగద తండ్రీ భావనారాయణా. ౧౭

మ. పురుషార్థంబులలోన శాశ్వతము నాఁ బొల్పారు మోక్షంబు; సు
స్థిరమౌ దానిఁ ద్యజించి యేమికత నా చిత్తంబు సేమత్రయిన్
స్థిరమంచున్ దలపోసి దాని సెసగా చెందంగ యత్నించు నీ
పాపాటున్ గరుణించి దిద్దవె స్వయంభూ! భావనారాయణా. ౧౮

మ. అనఘా కాంతిసమావృతంబుగద బాహ్యవ్యాప్తలోకంబు నా
కనుదమ్ముల్ వికసింపఁజేయుతరి విజ్ఞానాభ నాకెట్లు సం
జననంబయ్యెదు జ్ఞాననేత్రము భవత్స్వాధీనమైయుండఁగా
నిను బ్రార్థించెదఁ దెల్వికన్నొసఁగదండ్రీ భావనారాయణా ౧౯

మ. అపచారంబులు నీదు భక్తులకుఁ జేయు న్మూర్ఖులే వేనియున్
గుపితత్వంబున వారిఁ జెండెదవు నీకున్ భక్తులెన్నేని యా
మపచారంబు లొనర్చినన్ నగవుతో మాపణంబుతోఁ గొందవా
ర్యపితా, యాశ్రితపక్షపాతివిగదయ్యా భావనారాయణా ౨౦

మ. జలశుష్కంబయి సన్నగిల్లు బిదపన్ సాంద్రంబుగా వాహినుల్
చలదుత్తుంగతరంగసంకలితమై సంపూర్ణతన్ గ్రాలున

మ. నిను పెన్నండును మర్త్యవర్త్తిసుజను న్నీయంతసన్మూర్తిగా
ననఘా, చేయుదువంచు నేవిని భవద్వ్యాపారలీలారతిన్
దినము న్నేగడుపంగఁజూడ మతిహానిన్ విఘ్నముం జేయు ప్రా
వనె యెల్లప్పుడుఁజూచుచుండుగద దేవా భావనారాయణా. ౨౭

మ. ఎవరున్నారికి నిన్నుఁబ్రోచుటకు నేనేకాదె దిక్కంచుఁ బ్రా
భవమున్నాని యగమ్యదేశములఁ గన్పాపన్నరూపాని రూ
పవిలాసంబున దాల్చి బిగ్గఱగఁబిల్వన్ మాఱుమాటాడకే
యవమానంబును నాకుఁజేయఁదగునయ్యా భావనారాయణా. ౨౮

మ. సుకముంబొందెడువేళఁగూడ నకటా సుంతైన మాగర్వంబుమా
మకచిత్తంబున నుండనోపదు మహాత్మా భావిసంప్రాప్యదుః
ఖకరాశద్విపిదంష్ట్రిలాసదను మింగంజూచునవ్వేళఁ బ్రా
పక మేమంచును నిప్పుడే వెఱచు దేవా భావనారాయణా ౨౯

శా. బీజంబుద్ధరనాటినావు పిదపన్ వృష్టిన్ సకాలంబుతో
రాజిల్లన్ దయచేసినావు దయివారం దేజము న్వాయువా
పైఁజక్కంగను గూర్చినావు ఫలముల్ భక్షింపమాత్రోడ ని
ర్వ్యాజానందతఁజెప్పినావుగద దేవా భావనారాయణా. ౩౦

శా. నీకారుణ్యము గోరి భక్తులెపుడు న్వేధింపనీయుండకన్
రాకుండన్నలశాబ్ధిలోన గరళోగ్రవ్యాళతల్పంబునన్
జోకన్నిద్దురవోయిన న్విడుతురే శోధించినిన్బిల్వఁగా
రాకున్నావె గజేంద్రుఁబ్రోవ నఘదూరా భావనారాయణా. ౩౧

మ. చిలువన్ బట్టి విసంపుఁగోఱలను మున్ఛేదించి నాగస్వరం
బుల నుల్లాసము పెంచి సర్పగుఁడహంబున్ దానినాడించు నో

జలసత్త్వమను ద్వేషరాగ మదమాత్సర్యంబులం ద్రెంపి ని
చ్చలు నానందతఁదేల్పవేనను రమేశా భావనారాయణా. 32

శా. స్నానంబాడ ముదంబుఁగొల్పు నదిలోనన్ డిగ్గి యోలాడఁ బా
తీవ్రగ్రాహములందు స్నాతఁగని థాటిన్ నేగుచున్ గ్రుంగు న
ట్లే నీపూత మెఱుంగుసంస్మృతిసుఖం బేకోరరాగాదుల
య్యా నన్ బట్టెడుబాధఁబాపవె మహాత్మా భావనారాయణా. 33

మ. ఘనకార్యాతురతం దనూజుఁడు వియోగంబొంది పెక్కేండ్లకున్
జనకున్ జూడఁ బరస్పరంబుగనులన్ జాఱు నవోష్ణాంబువుల్
గనవా దుఃఖముముందు సంతసము వెన్కన్ దోఁచు నేనాఁటికే
న్నినుఁజూడన్మనకట్లు లేజరగుఁ దండ్రీ భావనారాయణా. 34

మ. ఎలనవ్వుల్ మృదుభాషణల్ సుమతనూ హేమాభ వాల్చూపులన్
జిలుగుంబయ్యెద సోగకుంతలములున్ జెన్నారశంపాంగిపెన్
వలపుంజిల్కుటఁజూచి మైమఱచి యానాతిన్గనన్ గోరు దు
ర్బలుఁడెట్టుల్ గననేర్చునిన్ను నఘదూరా భావనారాయణా. 35

మ. కనకంపుంగను లెన్నొ చూపఱకలంకారంబుగాఁదాల్చి మే
దిని కాన్పైనను స్వోపయోగమున కాప్తిన్ దీయనట్టీజడుల్
ధనమార్జించి రవంతయున్ దినక నిద్రాభుక్తులన్ మాని దా
నినిఁబోషింతురు లోభమెట్టిదియొ తండ్రీ భావనారాయణా. 36

మ. అతిశాంతాత్ములు జ్ఞానవంతులని ప్రఖ్యాతిన్ ధరంగాంచి దు
ర్మతిస్వాన్యాంతగముల్ గణింపక మహారౌద్రంబునన్ గ్రోధనుల్
వెతఁగల్పింతురొకప్పుడన్యులకుఁ దాల్మిన్ జ్ఞానమున్ వీడి యీ
పతితుల్ నీకృపఁగాంచు టెట్టులిక దేవా భావసారాయణా. 37

ష్యపరుండౌ పరమాత్మపుత్రుఁడగు జీవుండామనస్సంగతిన్
జపలుండైనిసుఁజేసుఁ గట్టకడకీశా భావనారాయణా. ౪౩

మ. యశముల్ వంశవిభూషణత్వమును విద్యాస్వాపతేయంబులున్
విశదానందముగల్గువారిఁగని గ్లానింబొంది లోఁగుందుచ
న్యశుభద్వేషులు పల్వురుందురుగదా యవ్వారుత్వత్సేవకుల్
వశులై యెట్టులనిన్నుఁగాంచెదరు దేవా భావనారాయణా. ౪౪

మ. దినముల్ బత్రము లెప్పపాటునసుఁబంక్తిన్ వ్రాసి పూరించు జీ
వనచారిత్రము నీవిమర్శనముఁ దెల్పంగోరియర్పింతురీ
జనులంతంబునఁ బక్షపాతరహితస్వాంతంబునన్ నీవుతీ
ర్పినతీర్పే యనుబంధమైనిలుచుఁ బేర్మిన్ భావనారాయణా. ౪౫

మ. ప్రకృతిన్ బుష్పఫలావృతంబయిన భూభాగంబుదర్శించు కం
టికి నానందము మెండు కంటకితవాటిన్ జూడఁగానోచు న
క్షికి సంతాపము మెండు సద్గుణవిరాజిన్ జూడ హర్షంబు పా
తకునిన్ జూడ నసహ్యమల్లెగద పూతా భావనారాయణా. ౪౬

మ. జలబాష్పంబులు మేఘమై చినుకులై జాలై తటాకంబులై
లలితద్వీపవతీమతల్లులయి కల్పస్థాయులై యొప్పున
ట్టులు పుణ్యాత్ముల ధర్మవృత్తిగతు లెప్డున్ వర్ధమానంబులై
ప్రళయంబందునఁగూడ వెల్గుఁగద దేవా భావనారాయణా. ౪౭

శా. ధేనూత్తంసము సత్పరోపకృతి నెంతేఁ జేయునం చెంచియే
దానింజూచినమస్కరింతురు పవిత్రంబంచుఁ బాపెప్పుడున్
ప్రాణాపాయమె సేయునంచుఁగద చంపన్ జూచెదర్ భేదమె
ద్దానన్ సజ్జనదుర్జనాళికిదె గాదా భావనారాయణా. ౪౮

మ. వరకాంతాకనకంబులన్ ప్రబలాతదివ్యప్రాభవంబుల్ గటా
యురిదీయంబడువానికెలయవి యాయుర్వృద్ధిచేకూర్చునే
నరజన్మంబును నుత్తమోత్తమమును నాకిచ్చినావైననా
మరణాయాసముదీర్చునేయది మహాత్మా భావనారాయణా. ౪౯

మ. భవబాధల్ పదిసార్లు జంతునరగర్భశ్రేణిగన్నట్టినీ
కవచూర్ణంబెకదా! మఱిన్ దెలుపవేలా! దానినేనిచ్చలున్
భవదీర్ఘామయవైద్యుఁడీవెయని చెప్పన్వించు నాజన్మపుం
దెవులున్ బాపఁగనిన్నుఁగోరెదను నర్థిన్ భావనారాయణా. ౫౦

మ. నియతంబైన త్వదీయధర్మములదేనిన్ మీఱినన్ బాపమున్
భయయోగంబునఁగాదె జ్ఞానులకుఁ బ్రాప్తంబౌను సారూప్యమా
రయ దీనిన్ వెలిజేయఁజూపితివి తార్కాణంబుపుర్వుల్ మహా
భయయోగంబున బంభరంబులకుఁ దేవా భావనారాయణా. ౫౧

మ. భువి ద్రవ్యార్థ్యుఁడొకండు మంచికుసుమంబుల్ దాల్చు సద్వాంఛతో
వివిధక్షేమము లర్థ్యయంత్రమును దెల్విన్ గట్టువిన్నాణము
త్సవతన్ జేదకుఁజూపులీలఁ బలుకుల్ ఛందస్సునుంగైతనీ
స్తవముంగోరుచు నాకొసంగితివె యీశా భావనారాయణా. ౫౨

మ. రవితేజంబొకటైన నద్దములనీరంబందు సంపాతమై
మివులన్ దేజముఁదోపులీల నమలామేయప్రభావాఢ్యమౌ
భవదుద్యద్ఘనకాంతి స్వచ్ఛతమజీవశ్రేణిబింబించి ది
వ్యవికాసంబును వెల్లడించుఁగద దేవా భావనారాయణా. ౫3

మ. తనపైవాని మనుష్యమాత్రకునె సందర్శింపసద్వస్త్రముల్
వినయంబున్ సమయంబవశ్యములగున్ విశ్వాధికారిన్ ఘనున్

నినుదర్శింపఁగ బాహ్యవేషములు తంత్రీముఖ్యముల్ గావు పా
వనచిత్తంబొకటేయవశ్యమగు దేవా భావనారాయణా. ౫౪

మ అలఘుప్రాభవమూని నేర్పున భవిష్యత్కార్యముల్ తత్ఫలం
బులు మాబుద్ధికిదాఁచినాఁడ వవియే బోధ్యంబులా నేని మే
ము లవంబున్ గృషిసేయనొల్లముగదా భూజాళికిన్ మాకు నా
వల భేదంబొకయింతలేదుగద దేవా భావనారాయణా. ౫౫

మ. తనవారున్ బెఱవారలంచు బహుధా తర్కించి వర్తించు నా
మనమెల్లప్పుడు బిడ్డలే గద తలంపన్ వారు నీకందఱున్
ఘనమాయాజననీప్రభావమున నేకత్వంబు భిన్నంబులై
కనుపట్టున్ సకలంబున్ నీకొకటెయౌఁగా భావనారాయణా. ౫౬

మ. కణజంబందున ధాన్యముల్ గలజనుల్ క్షామంబుగీమంబునన్
గణుతిన్ జేయుదురే పరాత్పర! భవత్కల్యాణశృంగారస
ద్గుణభావార్జితపుణ్యలేశములు సంతోషించియానందమొం
దునరుం డైహికకష్టమెంచునె సుబంధూ భావనారాయణా. ౫౭

మ. మనమన్ సారధి మోహలోభమదకామక్రోధమాత్సర్య చ
క్రనియోగంబయి వాంఛనాఁబడు శతాంగంబెక్కి త్రైగుణ్యమన్
గుణముల్ బారులుదీర్చి యింద్రియములన్ గుఱ్ఱాల్ వడిన్ లాగఁదో
లును ధర్మానువులూడఁజూడఁడు కృపాళో భావనారాయణా. ౫౮

మ. అనలస్పృష్టగృహస్థులైన ధన భార్యాపుత్రులన్ వీడుచున్
దనతాపోపశమంబుఁగోరి వెలికంతన్ వచ్చు భర్తంబలెన్
ఘనదుఃఖావృతసంసృతిన్ దొలఁగఁగాఁ గాంక్షించియందున్న నీ
షణముల్ మాఁటిఁద్యజింపఁగోరెద రమేశా భావనారాయణా॥ ౫౯

మ. అరిషడ్వర్గము నాఁగనొప్పు భయదవ్యాఘ్రంపుగుంపుల్ మహో
తురతన్ ముక్తిధనంపుఁబేటికినిఁ దోడ్తోఁగావలింబెట్టినా
వరయన్ దానినిద్రుంచినంగద నరుండందున్ దదర్థంబునీ
కరుణాసిన్ గొనవేనిఁజెందు మృగధాకన్ భావనారాయణా. ౬౦

మ. పుడమిన్ స్వల్పవిభాగమేలు ప్రభువేపొందున్ మనఃక్లేశమె
ప్పుడు; హద్దుల్ గనఁజాలనట్టి భువనంబుల్ లెక్కపద్మాల్గునే
లెడు దివ్యప్రభువైన నీవుపడు హృత్క్లేశంబువర్ణింప మం
దుఁడనాకౌనె సతంబు నిర్వ్యాజను గందున్ భావనారాయణా॥ ౬౧

శా. నానాస్థావరజంగమంబులను నున్నావంచుఁదెల్పంగ సు
జ్ఞానుల్ వేముఁదురంగముల్ వృషభ మశ్వత్థంబు సర్పంబునున్
ధేనూత్తంసము నాదిగాఁగలుగువానిన్ భక్తిమైనిచ్చలున్
ధ్యానాధిక్యతఁబూజసేయుదు రనంతా భావనారాయణా. ౬౨

మ. రవిభాసిల్లఁగ నెల్లజంతువులు కార్యవ్యాప్తిమైనుండినన్
రవినింజెందవు తత్ఫలంబు లోకమైనన్ బంచకర్మేంద్రియా
ళి విశేషంబగు నాత్మసన్నిధిని హాళిన్ గర్మముల్ సల్పఁజే
రవుగా తత్ఫలితంబులాత్మ నఘుదూరా భావనారాయణా. ౬3

శా. నారీరత్నము రాజపుత్రిపతి ప్రాణప్రాయయంచెంచకే
కౌరవ్యుల్ సభలోన ద్రౌపదికి నల్కన్ మానభంగంబుగాఁ
జీరల్విప్పెదువేళ నాయబల హా శ్రీకృష్ణయంచేడ్వఁగా
ధారాపాతముగాఁగ వల్వలిడలేదా భావనారాయణా. ౬౪

మ. వటుప్రాయంబునఁదోఁబరించితిని నన్ వాత్సల్యతన్ బ్రోచునం
చటుకుల్ గానుకగాఁ గుచేలముని నీకర్పింపఁబేరానతోఁ

బటుసౌహార్దగుణంబుభాసిలఁగ నాపాలన్ బ్రసాదించి యు
త్కటదారిద్ర్యముఁ బాపవే విబుధవంద్యా భావనారాయణా. ౧౫

శా. నాతిన్ బూతనహల్య దుష్టయని లోనన్ గౌతముం డెంచి య
ఖ్యాతిన్ బెన్ శిలగా శపించి యటుపైఁ గాకుత్స్థపాదద్వయీ
భూతిన్ నాతిఁగ మారెదంచు నుడువన్ మూర్ఛిల్లి రాయైనయా
నాతిన్ నాతిఁగఁ జేయవే విబుధవంద్యా భావనారాయణా. ౧౬

మ. అపరూపంబసకృద్విలాసము న మేయంబౌ జగన్మోహినీ
చపలాక్ష్యాకృతిఁ దాల్చి నివ్వెఱఁ బలాశశ్రేణిముగ్ధంగ స
త్కృప నింద్రాదులకున్ సుధాశనముఁ దృప్తిం గూర్చి దైత్యాళికిన్
విపులార్తిన్ ఘటియింపఁ జేయవె కృపాబ్ధీ భావనారాయణా. ౧౭

శా. వేదప్రాపకముల్ పరోపకృతి గర్విష్ఠారిసంహారమ
ర్యాదన్ స్వాశ్రితపాలనంబు విబుధాహ్లాదంబు పిత్రార్చనల్
సోదర్యాప్తియుఁ శౌర్యమున్ విరతిఁ ద్వత్తూనుల్ రహిన్నేర్వఁగా
నో దేవా యవతారధారివయినావో భావనారాయణా ౧౮

శా. సేవావృత్తియె యాదిఁ గష్టమటుపై సేవ్యుండు సంద్రుష్యుఁడై
భావంబు ల్వెలిఁబుచ్చకున్న మఱియున్ భారంబె గాదొక్కొ యే
త్రోవన్ బోయిన నేమి చిక్కొ యటునన్ దుల్యుండు నీకెందునున్
దేవా లేఁడని నిన్నుఁ గొల్తు నఘభేదీ భావనారాయణా. ౧౯

శా. ధారాళంబుగ నీదుభక్తుఁడని యాత్మన్ దోచెనేనిన్ నిజో
దారత్వంబుఁ దలంప కార్తివనధిన్ దాటింతువయ్యారె దు
ర్వారంబైన రణాంగణంబునను నాపార్థుండు నిస్వేదఁగా
సారథ్యంబును జేయలేదె పరమేశా భావనారాయణా. ౨౦

శా. అర్ధాంగిన్ వరసాధ్వి జానకిని మాయావేషతన్ గొన్న ప్ర
త్యర్థిన్ గూల్చినతమ్ముఁడుం చనక నిర్వ్యాజంబునన్వానిదౌ
స్వార్థత్యాగితకున్ విభీషణుని నాప్తశ్రేణిలోఁ జేర్చి నీ
వర్థిఁ బ్రాణములిచ్చి ప్రోవవె మహాత్మా భావనారాయణా. ౨౧

మ. అతులాస్వాదనబుద్ధి మై ఘనరసాలాగ్రంబునుం జేరి మూ
ఖతముండంచ ఫలంబులం దినక శాఖాక్రీడ చేఁదా నథః
పతనంబొందెడులీల భవ్య నరజన్మంబొంది గర్వించు నా
కతలందేగతియే మొకావవె మహాత్మా భావనారాయణా ౨౨

మ. తనకెందున్ బ్రతిలేఁడటంచెగసి యంతర్వ్యాప్తి మృద్భక్షణా
ర్థిన్ నియత్ జాయకుఁ గోర్కి తీర్చుతమిఁ బృథ్విం జాపఁగాఁ జుట్టి దౌ
ష్ట్యనిధానున్ దనుజాగ్రగణ్యుని హిరణ్యాక్షున్ వరాహాంబవై
జనులెల్లన్ గొనియాడఁ ద్రుంపవె మహేశా భావనారాయణా. ౨3

మ. హారినీదైవమె స్తంభమందుఁ గలఁడే యాతండు చూపింపుమం
చరికృత్యంబున హేమకశ్యపుఁడు ప్రహ్లాదున్ సుతున్ జెండఁగా
నరసింహాకృతిఁ దాల్చి స్తంభమున నున్నానంచు నావఁ దిశా
గ్యరవంబుల్ మ్రోలిపించి త్రుంపవెయరిన్ హా భావనారాయణా. ౨౪

మ. జనకాజ్ఞన్ దలఁదాల్చి లక్ష్మణమహీజాతాత్మతీయుండవై
వనముత్సేరుటవించు జానకిపయిన్ వాల్లభ్యమున్ బొంది మా
యను నాసాధ్వినిఁ గొన్నయట్టి దశమస్తాలంకృతున్ రావణున్
వనధిన్ గట్టివధింపవే రఘుకులాబ్జా భావనారాయణా. ౨౫

మ. బలగర్వాయత తేజుఁడౌ బలిసుపర్వశ్రేష్ఠునిం ద్రున్ మహో
త్కలికన్ నాకమునుండి త్రోల నదితీగర్భంబునన్ వామనా

ఖ్యాలసద్రూపముఁ దాల్చి యాదనుజు యాగంబందుఁ బాదత్రయీ
స్థలమున్ గోరి యడంపవే బలిని నీళాభావనారాయణా॥ ౨౬

మ॥ అరవిందోదర ప్రాపకంబునను శ్రుత్యాచారులై తారకా
సురపుత్రత్రయమున్ సురేశుపయి నీసున్ బూని బాధింపఁగా
పరబౌద్ధాకృతిఁ దాల్చి వేదచయ మప్రామాణ్యమంచున్ మహో
ద్ధురతన్ నేరిపి వారిఁ గూల్పవె సుబంధూ భావనారాయణా॥ ౨౭

మ॥ తనమాయామతి సోమకాసురుఁడు వేదంబుల్ హతానందునో
ద్దను క్రౌర్యంబున నగ్రహించి వెసఁ బాతాళంబునన్ దాఁచుటల్
విని మత్స్యాకృతివౌచు నీవసురునిన్ వేధించి వేదంబులన్
ఘనతన్ బ్రహ్మకొసంగి కావవె యనంతా భావనారాయణా॥ ౨౮

మ॥ సురలున్ దానవులున్ సుధాబ్ధి ఘటిమచ్చోఁ గుండలీద్రజ్జుచేన్
దఱువన్ మంధర మంథసాధనమునన్ బ్రావిర్భవంబైన ఘో
గరవ శ్రేణి కజాండముం గుతరిఁ గూర్మంబౌచు నీవంత మం
థరభారంబు వహించి ప్రోవవె మహాత్మా భావనారాయణా॥ ౨౯

మ॥ గరువం బెక్కిన పాపభూపతుల శిక్షాపాత్రులం జేయఁగా
దరుణంబంచును భార్గవుండవయి చేతన్ గొడ్డలిన్ బూని నీ
విరువైయొక్కతటిన్ నృపాలఖలులన్ హింసించి తద్రక్తని
ర్ఝరముల్ భూసతికీవె తర్పణముగా సద్భావనారాయణా॥ ౩౦

మ॥ చిఱుసవ్వల్ వోలు కాడ మోముపయి గజ్జల్ కాళ్లఘల్లుల్లనన్
ముఱువున్ జూపి యశోదకున్ వ్రజసతీపుష్పాస్త్రతన్ దాల్చియే
డ్తెఱఁ గంసాదిమహోగ్రరాక్షసుల ధాటిన్ గూల్చి శిష్టాళి హె
చ్చరికన్ బ్రోవవె రాధికారమణ కృష్ణా భావనారాయణా॥ ౩౧

మ॥ కలి రాజ్యాంతమునందుఁ బుట్టి మతసాంకర్యంబులున్ జూచి భూ
స్థలిఁ దత్కారకులైన దుష్టులు వినాశంబొంద భూదేవస
త్కులమందున్ జనియించి యశ్వమణిఁ దోడ్తో నెక్కి శాతాసిచేన్
జోలియింపన్ గలవాఁడు కల్కివయి జ్ఞానుల్ భావనారాయణా॥ ౮౨

మ॥ కరినాథుండు పిపాసచేతఁ గమలాగారంబునుం జేరి య
క్కొరనందున్ జరణంబుఁ బెట్ట ఘననక్రంబొందు దానిన్ మహో
ద్ధురతన్ బట్టఁగఁ గుయ్యొ మొఱ్ఱో యని యెంతో నిన్నుఁ బ్రార్థింప స
త్వర నేతెంచి గజేంద్రుఁ బ్రోచితివి మహాత్మా భావనారాయణా॥ ౮౩

మ॥ సరణిందప్పినశత్రుఁడైన మదిఁబశ్చాత్తాపమున్ బొంది నీ
శరణంబన్న ననుగ్రహింతువుగదా శాబాసు! సీతాసతిన్
స్మరతీవ్రత్వముచేతగానక దురిచ్ఛన్ గోరు కాకాసురున్
శరణార్థిన్ గరుణింపలేదె పరమేశా భావనారాయణా॥ ౮౪

శా॥ నీకారుణ్యముఁ గోరి నీపథులనెంతేఁ జేయుఁ వాఁడాప్తుఁడ
డైణకావాప్తిని నిన్నుఁ గూఱుజడుఁడయ్యా నీవుశత్రుండుగా
మైకాగ్రుండగుటన్ మురారిజుఁడు ప్రహ్లాదుండు నీభక్తుఁడ
స్తోకక్రూరుఁడు వానితండ్రి యరికాదో భావనారాయణా॥ ౮౫

శా॥ ఓకల్యాణగుణార్ణపేటి! సుకృతీ! యోనిత్యసత్యాకృతీ!
యోకారుణ్యమహాపయోధి! వరదా! యోభక్తరక్షామణీ!
యోకాలుష్యవనాగ్నిహోత్ర! యమలా! యోరాజరాజేశ్వరా!
యోకంసాదివిరోధిశిక్షణచణా! యోభావనారాయణా॥ ౮౬

శా॥ కేలునోర్మడ్చెద నీకు దాతవును ముక్తిద్రవ్యసంధాతవున్
లోలద్దిక్ప్రకృపాకటాక్షునివుఁ గల్లోలోపమార్తిన్ వ్రజా

ఖిలారిష్టభవాబ్ధినావకమును నాభీరాంగనా నేతనున్
లీలామానవ వేషధారికిని దండ్రీ భావనారాయణా॥ ౨౭

మ॥ ఇఁకనీయైహిక బాధలంబడుచు నేనెవ్వాళ్లనీకన్నదో
యికి మూరంబుగనుండఁగావలయుఁ దండ్రీ యార్తరక్షుండవన్
బ్రకటఖ్యాతినిఁబొందినాఁడవు నను న్బాటింపవేనిన్ మహా
త్మకయద్దానికి హానిగల్గుననుకొమ్మా భావనారాయణా॥ ౨౮

మ॥ తనజ్ఞాత్యాప్తగురూత్కరంబుననిలోఁ దాఁగూల్పసందేహమున్
గాని తెల్లంబడియున్న పార్థునకు సంకోచంబును న్మాన్పఁగా
ఘనవైరాగ్యము వర్ణధర్మవిధులన్ జ్ఞానంబునున్ నేర్పియో
యనఘా! గీతలుపన్యసింపవె మహాత్మా! భావనారాయణా॥ ౨౯

మ॥ కురువంశంబు సమూలకంబుగ మహింగూలంగ నాద్రౌణిని
ర్భరకోపంబున బాణమేఁయుతరి శాపప్రాప్తులై పాండవుల్
కరుణింపన్నినువేడ నాశ్రితులకుల్లాసంబుఁగల్పింప ను
త్తరగర్భస్థుఁబరీక్షితున్ మనుపలేదా భావనారాయణా॥ ౩౦

మ॥ జడులాత్మన్ నినుఁగాంచనోపుదురె సాక్షాత్కారమీవిచ్చినన్
బుడమిన్ స్వోదరపూరణంబునకె యెందున్ వారుగానిల్చుటన్
నడిని న్బాండవరాయ భారివగుచున్ సందర్శనంబీయ మూ
ఢుఁడు మర్త్యోఽధముఁడాత్మనిన్ దలఁచెనొక్కో భావనారాయణా॥ ౩౧

మ॥ పటునిద్రారతుఁడైనయర్భకుఁడు స్వప్నంబందునుద్యద్విషో
త్కటమౌ సర్పముఁగాంచి యుల్కిపడి శోకవ్యాప్తియమ్మాయలం
దటు పైఁదల్లినిఁబిల్చులీల ఘనమాయామోహ సంసారలం
పటుఁడౌ నేనినుఁబిల్తు బాధగనుపింపన్ భావనారాయణా॥ ౩౨

మ॥ సకలశ్రోతవు సర్వసాక్షివి లసత్సత్యామరూపుండవై
యకలంకా కనుమాటుగొందువుగదా యాగూముగోవిందసా
క్ష్యకుఁడా మామనృపోక్తికిన్ వగచి సాక్ష్యంబీయని న్వేఁడగాఁ
బ్రకటోక్తిన్ నిజమున్ వచింపవె యయో బాగా భావనారాయణా॥ ౩

మ॥ తనయున్ గాంచిన భాగినేయునకునై తథ్యంబొప్పఁ గానిత్తునం
చని గంగానదిలోనమున్ను భవదధ్వర్యంబునంబల్కె గా
వున కేశవభట్టుపుత్రిఁగని గోవిందుండునాకద్వితో
చెనయే యీయనటన్న నీవొసగవే దేవా భావనారాయణా॥ ౪

మ॥ శివుఁడే విష్ణువు విష్ణువే శివుఁడు దృష్టిన్ హెచ్చుతగ్గింతయున్
దవులంగూడదటన్న ప్రాఁబలుకు సిద్ధాంతంబుగాఁ జేయనా
శివునిన్ సుందరరాజ్యలక్ష్మిఁ గొని కాశీవీడిఁ దోతెంచి మా
భవముల్బాపఁగ నీడఁ జేరితివె దేవా భావనారాయణా॥ ౫

మ॥ తనువుల్నిత్యముగావు నీమృదుపదధ్యానంబె శశ్వత్సుఖం
బును నాకున్ దయసేయునంచు మదిఁ బ్రాపున్ గోరియర్పించితిన్
ఘనభక్తిన్ శతపుష్పమాలిక భవత్కంఠంబునన్ బ్రేమనా
యినతారాబ్జముగా ధరింపవె కృపాబ్ధీ భావనారాయణా॥ ౬

మ॥ తలిదండ్రుల్సతిసోదరుల్సుతులు నా పుత్రవ్రాతమున్ బాంధవుల్
కలకాలంబు భవత్పదాబ్జయుగమున్ గాఢంబుగాహృత్పథ
స్థలిఁ బూజింపఁగఁ జేసి యైహికదురిచ్ఛావల్లులన్ ద్రెంపియా
వల సాయుజ్యముఁ గూర్పవే కరుణ దేవా భావనారాయణా॥ ౭

మ॥ వరసాధారణ నామవత్సరములన్ వైశాఖశుక్లంపుభా
స్కరవారంబిల సప్తమీతిథి భవత్కల్యాణపర్వంబులీ

సరణిఁ భక్తిముగించినాఁడఁగాని దోషంబున్న మన్నింపవే
తురగావంశజ వేంకటాచల సుబంధూ భావనారాయణా॥

శా॥ ఔరా కాశియదేడ యీజనపదంబో స్వర్ణకాప్రాంతఘో
రారణ్యంబు లవేడ జన్మతనయోద్యన్మజ్జనంబేడ వు
ల్యారంభంబగు తుంగభద్రజలసౌఖ్యంబేడ కష్టించియీ
దారిఁ ద్రొక్కుట భక్తిఁ బ్రోచుటకె గాదా భావనారాయణా॥ ౯౯

మ॥ నిరతానందకనద్భవత్పదలస న్నీరేజయుగ్మంబు నే
స్మరియింపఁ గరుణింపవయ్య వితతాశాపాశముం ద్రెంపినీ
పరిచర్యఁ మతినిల్పవయ్య మరణాపద్వేదనన్మాన్పి శ్రీ
హరికైవల్యము సంగవయ్య పరమాత్మా భావనారాయణా॥ ౧౦౦

మ॥ మతినెట్టుల్లలపోసినాఁడవొ మహాత్మా యన్యుఁడఁ గాను నీ
సాతముఁ నాకెఱింగింపవచ్చునను ప్రేమఁ జూడఁగావచ్చునీ
స్తుతికిఁ గ్రొత్తను గానుజామ్మి గతమందుఁ భక్తరక్షామణీ
శతకంబుఁ రచియింపఁ గైకొనవె యీశా భావనారాయణా॥ ౧౦౧

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కీర్తనలు.

## (1) కళ్యాణి - అటతాళము.

నారాయణునిఁగనరే । పొన్నూరిబఁవ । నారాయణునిఁగనరే॥

రా రాజమకుటవి। రాజమానదివ్య। రత్నభాసితపద। రాజీవుఁడైనట్టి॥ నా॥

సారవిహీనసం। సారమునందుఁ। జరియించువారల్లరు॥

సారతముజ్ఞాన। సంపాదనారతిఁ। దీరిచి మోక్ష। ధారుఁడైనయట్టి॥ ౧॥

నేఁములేమున్నను। నన్నిటిపరి। వారముఁదాఁజేయును॥

క్రూరులవిజ్ఞాన। మూఢులసిరతా। చారులగుపధసం। చారులకుమియించు॥ నా॥ ౨

జగదేక మోహనుఁడు। సుందరతము। ఖగరాజవాహనుఁడు

నిగమాంతవేద్యుఁడు। నిత్యుఁడనవద్యుఁడు। సుగుణాకరుఁడుదివ్య।
శోభితాంగుఁడునైన॥ నారా। ౩

సామగానలోలుఁడు। కృపాళుఁడు। సంతోషశీలుఁడు। సర్వజ్ఞుఁడాఢ్యుఁ
డు। చారుసుందరవల్లి। రాజ్యలక్ష్మీశుఁడు॥ నారా॥ ౪

## (2) శ్రీరాగము - చాపుతాళము

సేవింపగారే- నారాయణు- భావింపరారే

శ్రీవిశ్వేశునిశుద్ధ- చిన్మయమూర్తిని॥ సేవిం॥ ౧

భావజజనకుని- భక్తరక్షకుని-

పావనచరితుని- బహుళావతారుని- భావనారాయణు - భవభయమా
రు - పాపవలుగఁజేసే ప్రార్థించుకొఁఅరు॥ సేవిం॥ ౨

ఆశలఁదెగఁగోసి- యరిషడ్వర్గఁమురోసి- యీశునివెదనూని- యీషణ ములమాని- ధీశాలులగుచును - క్లేశంబడయుటకు - నాసించినిత్యము - నా ముపాసమహాని॥ సేవిం॥ 3

అతఁడేసర్వజ్ఞుఁడు- అతఁడేసర్వసాక్షి- అతఁడేసర్వశక్తి - అతఁడేసర్వంబును- అతఁడుగానిదొకటి- యవనిలేదంచును- మతిఁనెంచియతని- నమస్కృతి గావించి॥ సేవిం॥ ౪

మనపాపములఁదూల్చి- మన్నించునాతఁడు- తనునాశ్రయించిన- జనుల నువీడఁడు- కనకాంబరధారి సుందరనిర్మలుఁడతని - నిన్ప్రార్థించుట - మనపని యనినమ్ముచు॥ సేవిం॥ ౫

## (3) బేహాగ్ - ఆదితాళము.

ననుబ్రోవవేలా- నతజనపాలా॥ నను॥

అనయమునీపద వనజములర్చించు॥ నను॥

పాపుఁడ గోపుఁడఁ బగమదుర్మార్గుఁడఁ గాపాడవేయని కాళ్ళనుబ్రా లిన॥ నను॥

ప్రహ్లాదనారదవ్యాసాంబరీషుల- నాహ్లాదమునఁబ్రోచినావని వేడగ॥ నను॥

ఎక్కడవిన్నను దిక్కునీవేయని- నొక్కిపల్కగ నీమక్కువగోరితి॥ న

గూనిగోవిందుఁడుకొనిమూడిపిల్వఁగ వానిబ్రోచుటకు వచ్చితివని వేడ॥న॥

భక్తదానచణా-పూజితచరణా-భక్తపరాయణా భావనారాయణా॥

## (4) కాంభోది - మిశ్రగతి.

చారుశారదచంద్రికాకీర్తి। దళితాఖిల సుజనార్తి॥ చారు॥

సారసాక్షివిశాలహృదయ। యసారసంసరణాబ్ధితారక। మారకోటి సమానదివ్యా। నిగకరుణాసాగరా॥ చారు

రాజపూజితపాదసత్క్రమాలా। రవికోటిసన్నుత। తేజమంగళవిగ్రహోత్తమలా। భ్రాజమానగుణాలవాల విరాజితైకకృపాంబుధీని। ర్వ్యాజభక్తసురంగచరణ సరోజములమదిభక్తిఁగొల్చెద॥ చారు

అన్నిటివినీపొట్టనుంచుకొనీ। సతతానురాగత నెన్నివిధములనోధరించుకొని। చిన్నతనముచుమాటలేక ప్రసన్నహృదయుఁడవై చరించెదు। సన్నుతాంగా ఏను మొదలగు చిన్నజంతువులందునైనను॥ చారు

ఘోరదైత్యతిమిరమార్తాండా। పరిరక్షితాఖిల భూరిస్థావరజంగమాజాండా। పూరిసన్నుతభక్తనేత్ర చకోరచంద్రపురాణపూరుష। భారమాననుబ్రోచుటకుఁ గన్నారఁజూపుము నీస్వరూపము॥ చారు

కందమూలఫలానిలాహృతులై। నిరతంబునినుగో। విందమాధవయంచు ధ్యానరతులై। యెందునున్నావంచువనముల యందుఁజేరివిరాగులైముని। బృందముల్వెదుకంగ బ్రహ్మానందపదవినొసంగిబ్రోవవె॥ చారు

కావరంబునఁగన్నుగానకయ। యెటులుత్రిప్పినంజెడుత్రోవలందున బుద్ధిమారకయ। భాగవతనిరసించిపాపపు భావలోఁబడియీదులాడుచు శేవలేకాసించునామతి। భావనారాయణాభగవత్కృప॥ చారు

## (౫) పూరికళ్యాణి - చాపుతాళము.

దిక్కెవరుమమ్ముఁబ్రోవ దీనుల నజ్ఞానమతుల॥

అక్కఱతోనీవుమమ్ము నాదరింపకున్న॥ ది।

పాపంబులఁబాఱఁద్రోలి పరమపద మొసంగుడంచు। నాపేక్షనున్నయట్టి యజ్ఞులకునునీవుగాక॥ ది॥

అనయంబునుజీవరాసు లన్నియుఁబెలుగంగఁజూచి కనుచాటుగ నున్నయట్టి మునివంద్యుఁడనీవుగాక॥ ది॥

నిరతంబునునీదు పాద నీరజములఁగొల్చినీదు కరుణను బ్రాపింపఁగోరు నరు
లకునీవెగతి గాక॥ ది॥

ధారాధరనీలదేహ దానవసంహారభావ । నారాయణాయచ్యుతాయ ।
నాకనాథనీవెగాక॥ ది॥

## (6) కాంభోది - త్రిపుటతాళము

ఎన్నఁగినదొంగవనియేమనుకొనిసేయ నిరసించుటిదితగునా॥ తండ్రీ॥
ధరమాకెల్లగతియును దాత్రడియుదైవము గురుఁడునీవేయని కొల్చినభాగ్యమా॥ ఎ
పిలిచినకొలఁదిని బెడ మొగము వెట్టు పెద్దలకిదినాయమా। కలిమిగలదుగా
జ్య గరిమగలదటంచుఁ జాలుకనసేసెదవా మముద్రోసెదవా॥ ఎతి
నిన్నునమ్మినవారి నెటుముంచుటనీకు। సన్నుతియనుపించునా । కన్నకొ
డుకులఁదండ్రి కడగండ్లఁబెట్టుట। యెన్నడైనవింటిమా। ధర్మగంటిమా॥ ఎతి॥
ఆపద్బాంధవుఁడన్న యాధికవిఖ్యాతిని నందియుంటివిగాదా। నాంపార్థు
తైనీదు తనయులుప్రార్థింప। ప్రాపుజూపకుందువా। పొమ్మందువా॥ ఎతి॥
తప్పుఁజేసినవారు దయఁగోరుచుండఁగ। ముప్పుఁబాపఁగరాదాఎప్పు
డుమాకింక నీబాధతప్పుట। గొప్పవాఁడవుగాదా। మాతోవాదా॥ ఎతి॥
చింతలఁబాపినీ చెంతఁజేర్చుటకు శ్రీకాంతావేళగాదా । పంతమేలమా
తో భావనాగాయశా। యంతరగమునుజూడవా। కాపాడవా॥ ఎతి

## (7)

ఎంతనిపలికెద చింతఁబాపఁగశ్రీ। కాంతుఁడనీతో పంతమనాతో॥ ఎంత
కాంతుఁడవీవుసా। మంతుఁడవీవెభగ వంతుఁడవీవెనా । కంతయువీవె॥
చెంతఁజేర్చుటకునీ। వంతైయున్నది। వంతమాన్పనభ్యంతరమెంచకు॥ఎం
ఆపత్తారక అసురచయమారక। ప్రాపుగానీవే భక్తనివారక॥ఎంత॥